# పీఠిక.

కథాంశమంతయు గ్రంథమునఁ గలదుగానఁ పీఠికలో నావశ్యకం
బనానితిమి. ఈగ్రంథమువ్రాసినకవులు నరసకవితానిపుణులు. వీరి కవి
త్వము కేవలద్రాక్షాపాకముగ దేశీయములతోడను స్వభావ వర్ణనల
తోడను గూడియుండును. కథానాయికయగు తిరుపతమ్మ సహగమన
మొనర్పఁబోవుభాగమున వీరువ్రాసినపద్యములు ఎట్టిమూఢునకైన పతి
వ్రతాప్రభావమును మనస్సునకుఁ జొచ్చునటుల బోధింపకపోవు. పూర్వము
సహగమన మొనర్చిన యువతీమతల్లుల కుత్సవాదులఁ జేయుటయు దైవ

భావముఁ గోఁదిలకించుటయు మన దేశీయుల కాచారమైయున్నది. ఈ
తిరుపతమ్మయు నట్టిది. ఏనాఁడో యశశ్శరీరముఁ దాల్చి చరిత్రవ్యాపిని
యైన యీతిరుపతమ్మకథనంతయుఁ జిన్న పాత్రముగ నొనర్చి భాషాపతి
కూడిక మొనర్చిన గ్రంథకర్తలగు మాకరాజు నారాయణరాజు కోలా
హలము సీతారామరాజుల కవితాకన్య కౌలఁదికాలమున నక్షరస్వరూ
పిణియై ప్రబంధరచనానంతరమున లోకమున పిలసిల్లఁగలదని యీచిన్ని
పాత్రము చెప్పక చెప్పుచున్నది. గ్రంథము సాధ్యమైనంతవఱకు నిర్దు
ష్టముగ వ్రాయఁబడెనని తోఁచుచున్నది. "మునేలు,తిరుపతిమ్మ"
లోనగుపదములు దోషములని యెంచిగియుఁ గథాపాశబద్ధులై

యుట్లొంచిరని మా తలంపు. ఏదేని లోపములున్న క్షమించి యీ బాలకవుఁ లుద్గ్రంథములో నర్పరసజ్ఞులనుగ్రహింతురుగాక!

ఇట్లు

శేషాద్రిరమణకవులు శతావధానులు సోదరులు,

కుమారరాజావారి

ఆస్థానకవులు.

గింపలగూడెము
4- —1916

# అభిప్రాయము

ఓ బాలకవులారా!

మీరు రచించిన ,,తిరుపతమ్మ,, యను గ్రంథము వ్రాఁతప్రతి నాద్యంతము, శ్రద్ధతోఁ జదివి, నిర్దుష్టమనియే, యభిప్రాయపడితిని. శైలి మృదుమధురముగనున్న యది. మీకైత వాగీశ్వరీకరుణచే దినదినాభ్యుదయముఁగాంచుఁగాత. సర్వేశ్వరుఁడు మీకాయురారోగ్యైశ్వర్యాభివృద్ధిఁగలుగఁజేసి మిమ్ము భారతదేశమునకు మేల్పుత్త్రులఁజేయుఁగాత.

ఇట్లు

కోటగిరి వేంకటకృష్ణారావు,
బహద్దరు, కుమారరాజా.

గంపలగూడెం
19—1—16

శ్రీకరుఁడు ప్రాణికోటిని • సృష్టిఁజేయు
కమలగర్భుని కడుపారఁ • గన్న మేటి
యైన శ్రీవిష్ణుదేవు పాఁ•దాంబుజమున
గంగతోనుద్భవించిరి • కమ్మవారు.

వ॥ వారిలో

సీ॥ సిరికినివాసమై • చెలువారుక[illegible]టి
వంశాంబురాశి జై • వాత్రికుంకు
విమలసద్గుణగణ్యా • వీరమాంబాసంగ
యాఖ్యులఁదనియించు • నట్టిసుతుఁడు
పతిభక్తియేమహా• వ్రతమంచు నేవేళ
భావించు లింగాంబ • పాణిభర్త

చిటిముటిమాటలఁ • జెవులపండువొనర్చు
చిన్నికృష్ణునిఁ జేర్చిఁ • గన్నతండ్రి

గీ॥ సుగుణగణ భూషితుండును • సుందరాంగుఁ
డతుల ధీశాలి శ్రీయప్ప • యాహ్వాయుండు
సుస్తులానంద మొప్ప నీ • పుస్తకంబు
నచ్చువేయించి యిచ్చె మా • కాదరమున

ఉ॥ శ్రీయుతుఁడై నఘూఘనుని చెల్మి కతంబున మాకరాజు నా
రాయణరాజు శ్యాలకుఁడ • నారత మొజ్జగఁ దున్కి పాటిలో
హాయిగనుండఁగ[illegible]గె • నట్టిమహాత్ముని ప్రాపె సర్వదా
బాయక మాకుఁగల్గఁగఁ గృ • పానిధి దేవుఁ డనుగ్రహించుతన్॥

శ్రీ

# తిరుపతమ్మ



తే॥ గీ॥ ఈ చరాచర భూతంబు లెల్ల యెడఁ
బుట్టుటకు వృద్ధిఁగనుటకుఁ గిట్టుటకును
గారణుండైన యాజగత్కర్త నెపుడుఁ
బ్రస్తుతింతుము మా మనఃపంకజముల॥

మ॥ కవులుర్ గాయకులుర్ వదాన్యులును సంస్కారుల్ ఋషిశ్రేణివే
దవిదుల్ వాహినులుర్ బతివ్రతలు భక్తవ్రాతముర్ మేదినీ

ధవళులు వీరులు లోహముల బలుగో • త్రంబుల్ స్వకీయ ప్రభో
ద్భవముల్ గాఁగ జెలంగునో రతమా • శా! నీకుఁ గేల్మోడ్చెదన్

చ॥ అనుపమభోగభాగ్యముల నబ్బుఁ గొల్పుచుఁ బాడిపంటలం
దునఁదుల లేనిదై, పలుకుఁ • ॰య్యలికిఁ జెలువంపుటున్కియై,
కనదురు సౌధరాజముల • గల్గి, జగంబున నందిగామ సీ
మను "పెనుగంచిప్రోలు" ; • వ బుగ నొప్పనుదంచితస్థితిన్

శా॥ వేదంబుల్ ఃతిరిగించి పచ సుమర్ల • విద్య స్తముల్ జేయుచున్
భేదంబేమియు లేక సర్వజ నుల • ప్రేమించుచున్, శాంతిదాం
త్యాదుల్ గల్గి నిరంతరంబు నిగమ • వ్యాసంగముల్ జేయుచున్
భూదేవోత్తములుందు రప్పురమునన్ • బూజ్యత్వముల్ గాంచుచున్ ॥3

చ॥ వితరణశాలురై యధిక • విత్తములుఁ మడిమాన్యములున్ కవి
ప్రతతికొసంగుచున్ మిగుల • శ్రావ్యములై నుతిఁ గాంచినట్టి స
త్కృతులను దాము గైకొనుచు • నెల్లపుడున్ హృదయప్రవర్ధితా
దృతిని బురాణపాళిఁ బఠి • యించుచునుందురు నియోగులప్పుడున్ ॥ 4
చ॥ ధనదు లెయప్పురింగల వ • దాన్యులు కోమటు లట్లుగానిచో
వనయము వచ్చు నాశ్రితుల • కందఱకున్ మితియింతయందు దీ
ప్పనలవిఁ గాని ద్రవ్యమును • బంచియొసంగుచు నుండినన్ గొలం
తనుగ వకుండ నెప్పుడు ధ • నప్రథితంబును గాంచ నేరుతో ॥ 5
చ॥ హలముఖ దత్తభాగ్యమున • నాదరభావము తోడ శీతసా
తలకును దానధర్మములు • దారతఁ జేయుచుఁ బండితప్రకాం

దులభజించి మంచియుండె ◆ దుర్గ్రహించుచు ధర్మమార్గని
స్తులమతిఁ బాయకుండుదురు◆శూద్రులుతత్పురమందు నెప్పుడున్ ॥ 6
మ॥ హనుమంతుండుశివుండు కృష్ణుఁడునృసిం ◆ హస్వామిభేతాళమా
త్రినగేంద్రాత్మజదేవళంబులపయిన్ ◆ దీపించు శిల్పంబులన్
గనఁగామున్నటి యాంధ్రశిల్పులమహా ◆ న్నత్యంబుఁదెల్లంబుఁగా
గనులన్ గట్టినయట్లు కన్పడును ద ◆ ద్గ్రామంబునన్నేఁటికిన్ 7
చ॥ వెనుకటినూడియీనగరు ◆ పెద్దదటంచును వెందఱో
అనుకొనుచుంటఁ గాకయివు ◆ డారయఁగా యవనావనీశుఁబా
ర్థన భవనద్వయంబువిధు ◆ రంబయికన్పడు నేమహామ్మదీ
యనృపతి పాలనంబున మ ◆ హామహిమంబుగ నొప్పుచుండెనో॥ 8

ఉ॥ ఆపురికిం గురంగట న • హర్నిశముం బ్రవహించుఁ బంకజా
తోపరిభాగభృంగనిక • రోదితమంజుర నప్రకాశితా
లాపము, సైకతాకరక • లాప, ముభంగ తరంగ సంచయ
వ్యాపితముం, సుధామధుర • వారియుతంబు మునేఱుసొంపుగన్ ॥ 9
చ॥ జలరుహనేత్ర తెల్లమబు • జాబుల బిందియలుంచి యున్నదీ
నలిలముఁ దేతురయ్య భయ • సంధ్యలఁ వారలమోవి కావి ది
క్కులఁ గలయంగ రాగవ న • గూర్చినటంచుఁ గవుల్ భ్రమించి ని
చ్చలు పరసప్రబంధముల • సారెకు వర్ణనఁ జేయునెల్లగన్ ॥ 10
ఉ॥ ఆ మునియేటి నానుకొని • హాళినిఁ గూర్చుచు నామ్రభూమి
రామచయం బహర్పతిక • రప్రకరప్రతి బంధకంబు, సు

త్రామవనోపమానము ని • రంతర సమ్మద దాయకంబు నై
యామునియందునన్ బికశు • కారవముల్ సెలఁగన్ జెలంగిడిన్ ॥11॥

వేసవికాలము గన ర • వి ప్రభలన్ గుడుస్సి పాంథులా
యాసముమీఱ నాయుపవ • నావళియందున విశ్రమింపగా
భాసురలీలఁగోయిలలు • పాడ సునోధనతాపతప్తతన్
గాసిలు చంద్రికప్పుడుప • కారము లేయ పకారముల్గదా॥ 12

ముని యేటికానక • ట్టనుగట్టదాని చేఁ
గడచుచునుండెను • కాలువలును!

కాల్వల సలిలసం • గ్రహణంబు నను గొలం
తలు లేకపండు కే • దారములును!

కేదారతతులను • త్పాదితంబగుధాన్య
నిబిడీకృతభవన • నికరములును!
భవననికరముల • పరిపూర్ణమైజెలు.
వైశానవచ్చుచు • న్నట్టివీధు!
గీ॥ లట్టివీధులలోపల • నాడుచుండు
బాలికా బాలకలుగల్గి • పరగునట్టి
పురముఁగాంచినఁ గన్నుల • కలవుఁదీఱుఁ
దీఱనిముదంబు మదికిఁజే • కూరుకతన॥
గీ॥ అపురమ్మునఁ గమ్మవం • శాబ్ధినంబు
జాలయువిధంబుననుబుట్టు • వందె నొక్క

షుళాదినంబువఁ బాధులున్నా • సుతిరయోనర్ప
స్థిరమతికిఁ బట్టుకొమ్మ శ్రీ • తిరుపతమ్మ॥ 14

గీ॥ పూవుఁబుట్టిన తోడనే • తావిఁగొల్పు
ననెడి రీతిగ బాల్యంబు • నందె సకల
సద్గుణావాసయై నిజ • సఖులతోడ
నాడుకొన్న నామెఁ జపులకా • హ్లాద మొదవు॥ 15

సీ॥ యౌవనమంకురించుటయు • నా సతి నిర్గుణాలవాలుఁ దుర్గ
భావభవ్యాపమానాంగనవ • భాస్వరరూపవిభాసితుండు, వి
ద్యావిశదుండు గోపయన • మాఖ్యఁ జెలంగెడువానికిచ్చి మా
దావహచిత్తులై చుఁ దలి • దండ్రులు పెండిలిఁ జేసిరంతటన్। 16

సీ॥ అనురాగమునవిద్ద • ఉల్లారుముద్దుగా
నెడఁబాయ కెపుడుఁ జ రించుచుండ్రు
సౌఖ్యంబునం దేని • సంకటంబున నేసి
పతిసతుల్సగ పాలు • పంచుకొండ్రు
గృహకృత్యములను నే • కీభావముగ విద్ద
ఆలోచనముఁ జేసి • యాచరింతు)
గురుజనంబులనిర్వు • రురుభక్తిఁ బూజల
సమముగా సత్యంబు • సల్పుచుందు
గీ॥ రెల్ల కార్యంబులమనిర్వు • రేకభంగిఁ
గలిసిమెలఁగుట చేత నా • కాపురంబు

భూతలస్వర్గమట్లు సం • పూజ్యమగుచుఁ
దీఆనిముదంబుతోడవ • ర్ధిల్లుచుండ॥

సీ॥ పరిహాసమునకైన • బొరబాటుగానైన
బొంకియెఱుఁగని • పుణ్యశీల!
బీదసాదలనుసం • ప్రీతితోనరయుచు
సాగుహాయ్య మొనరించు • సదయహృదయ!
సకలభూతంబుల • సత్కృపారసమగ్న
మానసంబునఁజూచు • మాన్యచరిత!
తనవారుఁబెఱవార • లనుభేదమాత్మలో
వీడివర్తించుసా • ధ్వీమతల్లి!

(2)



గీ॥ వినయసంపత్తివలరారు • విశ్వవినుత!
సుగుణభావలధరియించు • సుందరాంగి!
ఆత్మనాథునకర్ధాంగి • యగుచుఁగడుఁబ్ర
కీర్తివహియించె నీరీతిఁ • దిరుపతమ్మ॥ 8

గీ॥ కాపురమునందులోపము • ల్గలుగకుండఁ
బుట్టినింటికి మఱిఁదాను • మెట్టినింటి
కిని యశంబును మిగుల నా • ర్జనముఁజేసె
సంభ్రమాంతరంగంబుల • జనులువొగడ॥ 19

క॥ పతియు సతి యధికమైత్రిని
గతిపయదివసములు భోగ • కాంతులనుండఁ

సుతులుద్భవించిరార్య
స్తుతిమంతులు రూపవిజిత • మూనప్రదరుల్ ॥ 20

చ॥ వివిధసుఖంబులిట్లనుభ • వించుచు నిద్దఱుగూడి పెక్కు నా
ళ్లవితథరాగసంపదలు • నందఁగ నాసుగుణాత్మభర్త కా
లవశముచేత మేనునుతో • లంగెను శాశ్వతదేహధారులై
యవనివసించువారలెవ • రైననులేరుగదా? తలంపఁగన్ ॥ 21

చ॥ పతి తనువీడి • యీవిధిని • స్వర్గపురంబున కేఁగ నాపతి
వ్రత తనమానసంబున దు • రంతవిషాదము నొంది యింకపై
బ్రతికిననేమిలాభమగుఁ • బాపిణపదంబగు భర్తలేనిచో
పతయగుచుండుఁగాదె యలి • వేణులజన్మము లుర్విలోపలన్ 22

సీ॥ జనులెల్లఁ చిమె • చ్చఁగ నేమహాభాగుఁ
దగ్ని సాక్షిగఁ బెండ్లి • యాడెనన్ను
అక్రాంత మేపద • యాంతరంగుఁడు తన
ప్రాణంబురీతిఁ గా • పాడెనన్ను
కోరికల్ దీర్చి యే • గుణగణ్యుఁడెల్లప్పు
డంచితాదృతిని మ • న్నించెనన్ను
అనయంబుఁగష్ట మా • వంతలేకుండ నే
ప్రేమాస్పదుఁడు సుఖ • పెట్టెనన్ను
గీ॥ అట్టినాహృదయేశ్వరు • ననయమాస్మ
దీయహృత్పంకజమున వ • ర్తించువాని

నామనోరథనిధిని మ • న్నాథువీడి
నిలువశక్యమె భూమిపై • నిముసమైన। 23

ఉ। కావున సంశయంబువిడి • కాంతునితోఁడన స్వర్గసీమకున్
బోవుట కేయమా సుకృత • ముల్ బొనరించిన తత్సమానముల్
కావు నిజంబుగా మునువు • కాంతులతో దివికేగి యొందతీ
భూవలయంబులోన యశ • ముఁ గనియుండరు శాశ్వతంబుగన్ ।24

క। అని సహాగమనముఁ జేయఁగ
మనమునఁదలపోసి యత్త • మాః కును ద
క్షినబాధుజనులకును వం
దనమొనరిఁచి సెలవుఁగొని ము • దంబుననంతన్ । 2

గీ॥ పసపుఁగుంకుమ భూషలు • వస్త్రములు ము
దంబునను నేలవేల్పు ము • త్తైదువలకుఁ
బంచిపెట్టుచు జనులెల్లఁ • బ్రస్తుతింప
వెడలె సహగమనముఁ జేయ • విభునితోడ॥ 26

సీ॥ భువి భగవత్యంశ • భవగాకయున్న నీ
పగిదిఁ జేయు నెయంచుఁ • బలుకువారుఁ
బతికంటె సతికి దై • వము వేఱలేఁడంచు
నన నీమెతార్కాణ • యనెడువారుఁ
దొలిపుట్టువున నెంత • సలిపెనో పుణ్యంబు
జనుచుండె నాథుతో • ననెడువారు

ఇట్టి పుణ్యాంగన • నీక్షించుటంజేసి
మనము ధన్యులమైతి • మనెడువారుఁ
గీ॥ బతులయెడ భక్తిఁ గలిగిన • సతులపేరుఁ
జెప్పుటకుముందు నీమెనే చెప్పవలయు
ననుకొనుచునుండువారు నా • యమనుజూచి
నతిశతంబులు భక్తి నొ • నర్చువారు॥ 27
చ॥ సకలసుఖంబులన్ జనులు • సమ్మతిఁజేసెదురీతి నాత్మనా
యకుఁడును దానునొందియును • నంత విమానసముద్రప్తి నెం
దక మరలన్ బతిన్ గలసి • నాకసుఖంబుల నందఁగోరి యా
యకలుషితాత్మయే గెడున • టంచుఁ బ్రజల్ నుతియింపుచుండఁగన్

మ॥ జనులెల్లన్ దనవెంటరాఁగ ముదిత • స్వాంతంబుతో నివ్విధిన్
జనియా యగ్నిహోత్రునకుహ • స్తద్వంద్వమున్ మోడ్చిభ
క్తినిఁగావించి ప్రదక్షిణంబు జనులెం • తే విస్మయస్వాంతులై
తనువీక్షింప నిమీలితాక్షియగుచున్ • ధ్యానించెనీరీతిగన్ 29

చ॥ అలిగిననీవు లోకముల • కప్పుడె ముప్పుతటస్థమౌ దయా
కలితుఁడవైన యప్పుడు జ • గంబులుచల్లగనుండు నెన్నఁగా
నలవిమెసిన్ను గావున ద • యామహితాత్ముని నాథుతోనను
గలుపఁగవయ్య కాయమునె • కానుకగాఁగొని హవ్యవాహనా॥30

మ॥ రమణున్ వీడఁగలేక యిత్తఱిని స్వ • ర్గంబు బాధ నన్మచ్ఛరీ
రము నీరీతిఁ ద్యజించుచుంటి నిఁక స్వ • ర్గంబాదినన్ మేలె! త

ధ్యముగాజన్మములుండనేని యిఁక • నో దైవంబ ! నా కెన్ని జ
న్మములఁ గల్గఁగఁ జేతువన్న టను మ• న్నాథుఁ జేర్చఁ జేయుమా ।31।
బంధుగులార ! పోయెదను • స్వర్గపురంబునకంత్యమైన నా
వందనముఁ గ్రహింపుఁడిఁక • భావములోఁ బలనుంచఁ గోరుఁడే
నెందుననేనియుఁ దెలియ • కిగ్గులుఁ జేసితినేని యింకమీ
రందఱు దుఃఖమున్విడచి • యాత్మలలోన ముదంబు నందుఁడీ ।32।
అని యీవిధంబుగఁ జూ
చినవారలు మనముకలఁతఁ • జెందుచునుండన్
దనుని శ్రేష్ఠితులై కను
గొనుచుండఁగఁ దిరుపతమ్మ • కుతుకముతోడన్ । 33

సీ॥ పాండువసుంధరా • పాలునితో "మాద్రి"
సహగమనంబును • సల్పినట్లు
నలరాజుతోడ ని • శ్చలమతిఁ "చేరాంబ"
సహగమనంబును • సల్పినట్లు
నారసింహాప్పరా • ణ్ణాథుతో "జానకి"
సహగమనంబును • సల్పినట్లు
వేంకటాద్ర్యప్పరా • డ్విభునితో "సీతాంబ"
సహగమనంబును • సల్పినట్లు
గీ॥ పతులతోడిద లోకంబు • సతులకనుచు
స్వాంతమందెంచి పతితోడ "సహగమనము"

సలిపె|జను లెల్లఁదన్ను నం • స్తవముఁజేయ
స్థిరమతికిఁ బట్టుకొమ్మ శ్రీ, తిరుపతమ్మ॥ 34

చ॥ పతిదివి కేగినంతటనె • ప్రాణము నేనియు భక్తితోనమ
ర్పిత మొనరించునట్టిసుచ • రిత్రల నాంధ్రపురంధ్రులన్, బతి
వ్రతలను, సత్సతీమణులఁ • భావనశీలలఁగీర్తనీయ ధీ
మతులను, పూజ్యరాండ్రనుసు • మంబులఁబూజనొనర్పఁ  ల్లదే॥ 35

ఉ॥ రావణులంకలో మునుపు • రాక్షసులెంతగ బాధఁబెట్టినన్
భావమునందు"సీత" పతి • భక్తిని వీడగ లేదటన్న నీ
భూవలయంబులోపల న• పూర్వమటందురు కొందఱట్టివా
రీవనితామణిగనిన • నెన్నఁటి కేనటుపల్కనేర్తు 36

గీ॥ ధరణిలోపల నాచంద్ర • తారకముగఁ
జేరునిల్చునటంచు సం • ప్రీతితోడ
నాలయమ్ముఁ గట్టించి ధీ • శాలురెల్లఁ
జెలఁగి యేటేటఁ దిరునాళ్ళఁ • జేయుచుంద్రు॥ 37

ఉ॥ పూతచరిత్రయైమిగులఁ • బూజ్యతఁ గాంచిన తిర్పతమ్మకీ
రీతిగ నాలయంబొకటి • సృష్టియొనర్చి మహాత్ములెల్ల సం
ప్రీతిగ నుత్సవాదులొన • రింపక పోయినచోఁ బతివ్రతా
ఖ్యాతి జగంబునం దెటుల • వ్యాప్తముఁ గాంచి స్థిరత్వమూనెడిన్॥ 188



శ్రీ

# ఉత్సవప్రారంభము.

సీ॥ కమ్మసంతాన మే • యమ్మపుట్టుపుచేత
స్థిరతరకీర్తినా • ర్జిం దినదియొ !
గుణగణోజ్జ్వలుఁడైన • గోపయాహ్వయునక
ర్ధాంగియై యేతన్వి • యః రినదియొ !
భగవత్సమానుగా • భర్తనుదలఁచి యే
చెలువ సద్భక్తిన • ర్చించినదియొ !

గతించినవెన్క • బ్రతుకువ్యర్థమటంచు
సేవాధ్వ తను వగ్ని • కిచ్చినదిరయొ !
గీ॥ బాపురే ! మృతజీవయర్ • బ్రజలనుడికిఁ
బాత్రియై యేసుశీల లో • కత్రయమున
వన్నెకెక్కె,నా ! స్థిరకీర్తి • వలననట్టి
తిరుపతమ్మ వేడుకఁ జూచి • తీఱవలయు! 39
సీ॥ అంబయేశాసట్టు • లనతరించెనటంచు
నెంచి సద్భక్తిఁబూ • జించువారు
ఆపత్సమయమందు • నాదరించినతల్లి
యంచు మొక్కులుదీర్పు • నట్టివారుఁ

గోరింకగోరికల • గాదవరేకయదీర్చు
నిలువేలుపని కొన్కు • లిడెడువారు
ఫలవమూహాంబులు • పాయసంబుగఁదెచ్చి
మించుబేర్మిని సమ • ర్పించువారుఁ
సీ॥ కలిగిజ్యోతిర్మహోత్కుంభ • మ లనుగలిగి
చిత్రితరవాద్యములనువి • చిత్రమగుచు
ధూపదీపమంగళహార • తుల వెలుంగు
తిరుపతమ్మ వేడుకఁ జూచి • తీఱవలయు॥ 40
సంతానవాంఛచే • స్నానముల్ఁ జేసి "పా
ణాచారము" ల్బడు • నట్టిసతులు

25

ముప్పుఁగల్గినవాఁడు • మ్రొక్కినట్టుల "కంద
దీపముల్" వెలిగించు • దీనజనులు
జననకాలంబునం • దునఁబల్కినట్లుగాఁ
"బుట్టువెంట్రుక"లిచ్చు • పుణ్యమౌ నీ
యిష్టమా కోరిక • లీడేర్చునని భక్తి
"నిల్వుదోపు"లొసంగు • నిశ్చలాత్మ
గీ॥ లతినియతిఁ బువ్వములఁగోడ • నర్చనంబుఁ
జేయుచు నివేదనంబు వి • శేషభక్తి
నర్పణముఁ జేయుజనములం • దండఁజెలఁగు
తిరుపతమ్మ వేడుకఁజూచి • తీఱవలయు॥

సీ॥ ప్రభల ముందాలీఢ • పాదులై శాక్తేయు
లల్లల్ల శరభాయ • టంచుఁజదువ
త్రాలకు మొఱ్ఱఁగా • రాదంచుఁగ్రై) స్తవుల్
నాస్తికవాదము • నర్పుచుండ
తంబురఁ జేఁబూని • దాతలంగదసిజం
గమువార లోకవంకఁ • గథలుజెప్ప
రామ! హరీ! పరం • ధామ! యటంచుఁ గొం
దఱు భక్తవరులు కీ • ర్తనలుపాడ!
గీ॥ గుడులముందఱఁ గుంపుగాఁ • గూడిముద్దు
లొప్పమీఱఁగఁ గొందఱు • జెప్పుచుండఁ

కనులపండువౌ సర్వంగా • గలుగునట్టి
తిరుపతమ్మ వేడుకఁ జూచి • తీఱవలయు॥ 42

సీ॥ తల్లిదండ్రులఁ బాసి • తాగుమాలైన బి
డ్డలనెల్లఁ దల్లిదం • డ్రులకుఁ గల్పి
పేరుతాయినివా • పేరుతాయిగఁ దూఁచు
సాహుకారులనెల్ల • సంస్కరించి
తడబాటుఁ గన్పట్టి • మడేనగల్క త్తిరిం
చెడి గ్రామములనెల్ల • శిక్షఁ జేసి
మద్యపానంబున • మత్తెక్కియుండలుగు
ర్త్రాలుఁ గనివారియ • ల్లరులమాన్పి

గీ॥ ఒత్తుగాని పైనిఁబకుటకు • నుద్యమించు
వారి వారించి యొప్పడ • వ్వారిగాఁగఁ
బరగుచుండెసురటుల • భటులుగలుగు
తిరుపతమ్మ వేడుకఁజూచితిఁజవలయు, ॥ 43

సీ॥ బాణాంగనలభంగి • నుద్యద్ద్యుతుల్గల్గు
గానుల కైసేసి • కదలువారు
దేవాంగనలభంగి • దేదీప్యమానప
డాలజాకెట్లచేఁ • గ్రాలువారు
నాగాంగనలభంగి నవ్యమాణిక్య భూ
షలఁ జేర్మిధరియించి • మెలఁగువారు

రాజాంగణలభంగి • రమణీయసహజ సౌం
దర్యంబునుంగల్గి • తనరువారు
గీ॥ నాగరములు, నానులు, తాలు• నగలు, ముదముఁ
గలుగఁ జేయు ముచ్చటముల్లఁ • గలిగినుల
కింపుఁగలిగించువారిచే • నింపఁబడిన
తిరుపతమ్మ వేడుకఁ జూచి • తీఱవలయు! 44
సీ॥ పద్మంబుపైని ష • ట్పదములకైవడి
మోమునముంగురుల్ • మురువుఁజూపఁ!
డోరంపురతనాల • దుద్దులకాంతులు
గండస్థలంబుల • గ్రిమ్ముకొనఁగఁ

గాళ్ళకమర్చిన • కటకంబు గొండొంటి
నిండా ఘల్లను • నినదమొసఁగ!
గంటంబునంగల • కనకహారావళుల్
కుచకుంభములమీఁదఁ • గునిసియాడ!
గీ॥ ఏమదగజయానలెల్లను • శ్యామపూరి
కార్మలై యచ్చటచ్చట • నలరియున్న
వింతలంజూచు నాసక్తి • వెడలునట్టి
తిరుపతమ్మ వేడుకఁజూచి • తీఱవలయు! 45
ఏవంకఁగనుఁగొన్న • నిసుక వేసిన రాల
కంతట నిండిన • యట్టిప్రజలె!

ఏదారిఁగనుఁగొన్న • నడఁబాటు లేకుండ
బారుబారులుఁ గల్గి • వచ్చుప్రభలె!
ఏదాయఁ గనుఁగొన్న • నీడు వారలఁగూడి
వేడ్కతోఁ బండెము • వ్రేయువారె!
ఎచ్చోటఁగనుఁగొన్న • నిచ్చవచ్చినయట్లు
సంచరించెడిగణా • చార్యగణము!
గీ॥ ఎచటఁగనుఁగొన్న చేరంబు • లిష్టమున్న
తెలుఁగునం జేయుచుండెడు • ధీరమతుల
కలిగియుంపారుచుండ న • క్కజముఁగాఁగఁ
దిరుపతమ్మ వేడుకఁ జూచి • తేలవలయు! 46

దామోదరు దశావ ، తారముల్ తమయందు
గల "వ్రిభ" లోకవంక • వెలయుచుండ!
మహపూర్వులచరిత్ర • లనుఁబ్రిదర్శించెడు
"కంపెనీ" లోకచాయఁ • గ్రాలుచుండ!
విశ్వంబునంగల • వింతలన్నిటిఁజూపు
"బైస్కోపు" లోకశ్రేవఁ • బరగుచుండ
క్రూరమృగంబులం • గొనితెచ్చియాడించు
"సర్కసు" లోకచోటఁ • జరుగుచుండఁ
గీ॥ గడువిచిత్రంబుగాఁ గను • గట్టుఁగట్టి
"గారడీ"చేయుచున్నట్టి గారడీంద్ర

తోడఁ జూపరులకు వింతఁ • దోఁపఁ జేయు
తిరుపతమ్మ వేసుకఁ జూచి • తీఱవలయు । 47

శా। బారుల్ దీరిచియంగడుల్ సాగముగాఁ • బట్నంపు బాజారుల
ట్లో రాజిల్లుచునుండ, బేరులుముదం • బేపారవ్యాపారముల్
ధీరోదారతఁ జేయుచుండ, సుజను • ల్దీనిన్విలోకించి, "గుం
టూరో! బావరో" యాచుఁబల్కుటలు విస్తారంబుగా దేరికిన్ ।

ఉ। కాళుల గజ్జెముల్ కగయు • గంబునఁ దాళములం గ్రహించిభ
క్తాళి ముదంబుతోడ వల • యాకృతినిల్చి యనేకదీపికల్
గ్రాలెడు స్తంభమొనుసువెలు • గంగను మధ్యను, భక్తితోడ సీ
తాలలనా మనోహరుని • స్తోత్ర మొనర్తురు నృత్యపద్ధతిన్ । 49

వ॥ పిత్రుదుర్జనము వలన వచ్చు ధనమును, 50

చ॥ క్రమముగ ధర్మకర్తలున్వ • కార్యముగా మది నెంచి ధర్మస
త్రములకు సత్కవీంద్రులకు • బ్రాహ్మణకోటికి సద్గ్రహావివా
హములకుఁ జాతకాలలకు • సంగవిహీనుల కాలయాదికా
ర్యములకొసంగు చుందురు ఋ • ధావళినన్ను తిఁ జేయునట్లుగ॥ 51

సీ॥ తనజన్మమున నెప్పు • డును గనుంగొనవట్టి
చోద్యంపు వస్తువుల్ • చూపఁజాలు!
ఎక్కడెక్కడనో వ • సించుచునుండెడు
చుట్టాల నొకమాటె చూపఁజాలు

సరిఁ దడటంచు సించుక • సంశయింతు
మెల్లరకుఁ దృప్తిగాఁ జెప్ప • నేరితరము॥ 53

ఉ॥ శ్రీకరమౌ సమస్తజన • సేవితమై భువన ప్రసిద్ధమై
యాకలి ప్రజాళియు • యుచితవస్తు నిధానమై యుక్త
త్యాకరమౌ కురంతకలు • పాపహారంబు దక్షమై
లోకము లను నెప్పుడు నవె • లుంగుత నుత్సవ యూనిధంబు గ్ర 154

స ం పూ ర్ణ ము.



